THE ANDHRA PATRIKA - MADRAS.

8 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

తాత్కాలిక రాజధాని మద్రాస్‌లోనే వుండాలని
డిప్యూటీ స్పీకర్ సూచన
—3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఆంధ్రరాష్ట్రంలో సుస్థిర ప్రభుత్వం ఏర్పడాలి:
ప్రకాశంగారి ఉద్బోధ
—4 వ పేజీ

318495

Regd. No. M. 1118 | సంపుటం 39. సంచిక 343 | FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. | గురువారము 19-3-1953

# వాంచూ నివేదికపై నేడే కేంద్రప్రభుత్వ నిర్ణయం

## జిల్లా బోర్డుల పరిపాలన

### సోమవారం నాడు అసెంబ్లీలో తీర్మానం

మద్రాసు, మార్చి 18: జిల్లాబోర్డుల పరిపాలనా ఏర్పాట్లకు సంబంధించిన తీర్మానం ఒకటి అసెంబ్లీలో ప్రతిపాదించ బడుతుందని స్థానికపాలనమంత్రి శ్రీ ... శంకరరెడ్డి నేడు అసెంబ్లీలో చెప్పారు.

శ్రీ వి. రామారావు ప్రశ్నకు సమాధానమిస్తూ ఆంధ్రరాష్ట్రం త్వరలో ఏర్పడ నున్నందున నూతన రాష్ట్రము ఏర్పడేవరకు జిల్లాబోర్డు ఎన్నికలను వాయిదా వేయాలని ప్రభుత్వం నిర్ణయించిందని మంత్రిగారు తెలియజేశారు.

శ్రీ రాజగోపాలరావు: ఆంధ్రరాష్ట్రం ఏర్పడేటంతవరకు ఎన్నికలను వాయిదా వేయకుండా ఎప్పుడు ఎన్నికలు జరుగుతాయో ఖచ్చితముగ తేదీ తెలియజేయుదురా?

స: తేదీ ఏదీ నిర్ణయించలేదు. ఆ విషయం ఏర్పడబోయే రాష్ట్రము లకు వదిలివేయబడింది.

శ్రీ కొంటూరు వాసుమంతిరావు: పంచాయితీ ఎన్నికలకు, ఉపఎన్నికలకు అడ్డంరాని ఆంధ్రరాష్ట్రం ఈ ఎన్నికలకు ఎందుకు అడ్డంవచ్చింది?

స: పంచాయతీ ఎన్నికలు జరిగిపోతున్నాయి. ఇంకా 4 వేల పంచాయతీలుమాత్రం పునర్నిర్మాణం కావలసి వుంది.

శ్రీ కె. గోవిందరావు: అప్రతిష్ఠ కాకుండా ప్రస్తుతపు జిల్లాబోర్డు పరిపాలనను అంతం చేయుదురా?

స: ఈసందర్భంలో ఒక తీర్మానం సభవారి ముందుంచబడుతుంది.

శ్రీ నాగిరెడ్డి: ఎన్నికలను ఇప్పుడు వాయిదా వేసిన ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన వెంటనే ఎన్నికలు జరుపుటకు వీలు పడదని ఇంకా వాయిదా వేయవచ్చని ఉద్దేశమా?

స: ఆంధ్రరాష్ట్రం ఏర్పడి అందు శ్రీనాగిరెడ్డిగారు అధికారంలో వుంటే ఆవిషయం ఆలోచించు కోవచ్చును.

ఈవిషయంలో వచ్చే సోమవారం ఒక తీర్మానం ప్రతిపాదించ బడుతుందని స్పీకరు ప్రకటించారు.

#### కాలపరిమితి పొడిగింపు

మద్రాసు, మార్చి 18: జిల్లాబోర్డుల అధికార కాలపరిమితిని ఏప్రిల్ 8 నుంచి మరొక సంవత్సరంపాటు పొడిగించటానికి ప్రభుత్వం నిర్ణయించి నట్లు తెలుస్తున్నది.

## రాష్ట్ర రాజధాని విషయపై తొలిసమావేశంలో అసంపూర్ణ చర్చ

### తుంగభద్ర ప్రాజెక్టు నిర్వహణకు అంతర్రాష్ట్రీయ సంస్థ ఏర్పడే అవకాశం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, మార్చి 18: కేంద్ర మంత్రివర్గం ఇవాళ ఉదయం సమావేశమై శ్రీ వాంచూ నివేదికను చర్చించింది. సమావేశం దాదాపు మూడు గంటలు జరిగింది. అయినా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సంబంధించి ఈ సమావేశంలో నిర్ణయం అంటూ ఏమీ జరిగినట్లు కన్పించదు. మంత్రివర్గం తిరిగి రేపు సమావేశమౌతుంది. రేపటి సమావేశంలో వాంచూ నివేదికపై నిర్ణయం జరగ్గలదని తెలుస్తున్నది.

నేటి చర్చలలో రాష్ట్ర రాజధాని సమస్యే ప్రాధాన్యం వహించినట్లు తెలుస్తున్నది. ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని అయిదేళ్ళపాటు మద్రాసులో వుండాలని, అది సాధ్యం గాక పోతే తాత్కాలిక రాజధానిని విశాఖపట్నంలో ఏర్పాటు చేయవచ్చునని శ్రీ వాంచూ సూచించారు. శాశ్వత రాజధాని నిర్మాణానికి కృష్ణానది దక్షిణతీరం (విజయవాడ-గుంటూరు మధ్య ప్రాంతం) అనుకూలంగా వుంటుందని కూడా శ్రీ వాంచూ సూచించారు.

మద్రాసులో తాత్కాలిక రాజధాని ఏర్పాటుకు సావకాశం లేనందున తాత్కాలిక శాశ్వత రాజధాని అనే విచక్షణ లేకుండా రాజధాని స్థలాన్ని నిర్ణయించటమూ లేక ఈ నిర్ణయాన్ని ఆంధ్ర అసెంబ్లీ సభ్యులకు వదిలివేయడమా అన్న విషయంపై మంత్రివర్గం నేటి సమావేశంలో ఒక నిర్ణయానికి రానట్లు అతి విశ్వసనీయంగా తెలుస్తున్నది. రాజధానిని కేంద్ర ప్రభుత్వమే నిర్ణయించే పక్షంలో శ్రీ వాంచూ నివేదికను అంగీకరించి ఒకసారి గుంటూరు-విజయవాడలమధ్య శాశ్వత రాజధాని ఏర్పడాలని నిర్ణయించడం గురించి రేపటి సమావేశంలో అంతిమనిర్ణయం జరుగవచ్చును.

బళ్లారిజిల్లాలోని మూడు తెలుగు తాలూకాలను ఆంధ్రలో చేర్చి మిగతా ఆరు తాలూకాలనూ మైసూరు సంస్థానంలో చేర్చుటకూడా ప్రభుత్వ ఆలోచనలో వున్నట్లు కన్పిస్తుంది. తుంగభద్రా ప్రాజెక్టు నిర్వహణకు ప్రత్యేక అంతర్రాష్ట్రీయ సంస్థ నొకదాన్ని ప్రభుత్వం నియమించవచ్చును. ఈ సంస్థ కేంద్రప్రభుత్వ అజమాయిషీ క్రింద పనిచేయవచ్చును.

### చక్కెర ఉత్పత్తి వృద్ధి అనవసరం

#### కిద్వాయ్ ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 17: పంచదార ఉత్పత్తి ప్రస్తుతం దేశావసరాలకు సరిపోనువున్నదని, ఉత్పత్తిని పెరగనివ్వరాదనే ప్రస్తుతంప్రభుత్వ విధానమనీ ఆహార మంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్ నేడు ప్రజాసభలో తెలియజేశారు.

ఉత్తరదేశంలో కిట్టుబాటుగా లేని చోట్ల వున్న ఫ్యాక్టరీలను దక్షిణాదికి తరలించడానికి అనుమతించబడిందనీ, ఇందువల్ల దక్షిణాదిన పాలిణా ఉత్పత్తి 30 వేల టన్నులు హెచ్చగలదనీ ఆయన అన్నారు.

వనస్పతి ఉత్పత్తి 1948 లో 1.8 లక్షల టన్నుల నుంచి 1952 లో 1.91 లక్షలకు పెరిగిందన్నారు.

పోస్టాఫీసు సేవింగ్స్ బాంకు ఖాతాలలోనూ, సర్టిఫికేట్ల రూపాన వున్న రూ. 300/- లక్షలను పాకిస్తానుకు బదలాయించవలసి వున్నదని కమ్యూనికేషన్స్ శాఖ డిప్యూటీ మంత్రి తెలిపారు.

కండ్లా హార్బరు నిర్మాణం ఈ నెల ప్రారంభమవుతుందని రవాణా శాఖ డిప్యూటీ మంత్రి తెలిపారు. దీనికి మొత్తం రూ. 12.05 కోట్లు మంజూరు అయాయనీ, 1953 జనవరి ఆఖరువరకూ 1.88 కోట్లు ఖర్చు చేయబడినాయనీ చెప్పారు.

### 14 మంది టునీషియన్లకు ఉరిశిక్ష

#### పియర్సన్‌కు విజ్ఞప్తి

యునైటెడ్ నేషన్స్, మార్చి 17: ట్యునీషియాలో ఫ్రెంచి అధికారులు ఉరిశిక్ష విధించిన 14 మంది తరపున ప్రమేయం పెట్టుకొని, వారికి ఆ ఉరిశిక్ష తప్పేటట్లు ఫ్రాన్సుతో ఆలోచన చేయవలసిందిగా సమితి అధ్యక్షుడు పియర్సన్‌ను అరబ్-ఆసియా రాజ్యాలవర్గంవారు నేడు ఒక విన్నపాన్ని పంపారు.

ట్యునీషియా ప్రస్తుత స్థితిగతులు మారి అవి బాగుపడేటట్లు చూడవలసిందిగాకూడ ఈ విన్నపంలో వీరు సమితి అధ్యక్షుణ్ణి కోరారు.

## 'ఫ్రెంచ్, పోర్చుగీస్ భూభాగాలు సైనిక స్థావరాలుగ మారితే అది శత్రుచర్యే'

### ఇవి మాతృదేశంలో విలీనం గాకతప్పదని నెహ్రూ ఉద్ఘాటన

#### విదేశ వ్యవహారాలపై చర్చకు సమాధానం

న్యూఢిల్లీ, మార్చి 17: ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ పార్లమెంటులో ఈవేళ విదేశాంగశాఖ డిమాండ్లనుగూర్చి రెండురోజులుగా జరుగుతున్న చర్చకు సమాధానమిస్తూ "ఇండియాలోని వలసప్రాంతాలు సైనిక స్థావరాలుగా వినియోగ పరచబడినట్లయితే, దానిని తామొక శత్రుచర్యగా పరిగణించ గలము." అని హెచ్చరికచేశారు.

"బ్రహ్మాండమైన బ్రిటిష్ సామ్రాజ్యమే అంతరించి పోయింది; అలాంటిది ఇలాంటి చిలక్కొట్లు ఇండియాలో నిలిచివుంటాయనుకోవటం పొరపాటు," అని కూడా ఉద్ఘాటించారు.

భారతప్రభుత్వం అనుసరిస్తున్న విదేశాంగవిధానాన్ని సమర్థిస్తూ, ఇండియా ఈ విధానాన్ని అవలంబించటం, చారిత్రకంగానేమి ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా నేమి అనివార్యమనీ, ఇప్పుడు కాంగ్రెసు కాక ఏ యితర పార్టీ అధికారంలో వున్నా, యించుమించు ఇదేవిధానాన్ని అనుసరించి వుండేదనడానికి సందేహం లేదనీ, పండిట్ నెహ్రూ నొక్కిచెప్పారు. కామన్వెల్తులో ఇండియా సభ్యత్వాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, ఈసభ్యత్వం ఇతర కామన్వెల్తు రాజ్యాల సభ్యత్వం కన్నా విలక్షణమైందనీ, ఆర్థికమైన బాధ్యతలుగాని రాజ్యాంగ సంబంధం గాని ఏమీ పెట్టుకోకుండా స్నేహభావంతో పరస్పరం సహాయం చేసుకుంటూ వుండడమే తమ ఈ సంబంధంలో వున్న వైచిత్రి అనీ, పండిట్ నెహ్రూ అన్నారు.

అనంతరం ప్రతిపక్షుల విమర్శా ధోరణిని పరిహసిస్తూ, తాబట్టిన కుందేటికి మూడే కాళ్లన్నట్లు కమ్యూనిస్టులు గుడ్డిగా చేలో బడ్డట్టు ఎడతెగకుండా ఓపికతో అవేమాటలు అవే విమర్శలు చర్విత చర్వణం చేయగల్గటం ఒక విధంగా అభినందనీయం కాకపోదని అన్నారు. పాకిస్తాన్ విషయంలో డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ అవలంబిస్తున్న వైఖరికూడ యించుమించు యిలాగే వుందని ఉపాలంభించారు.

జయపాల్ సింగ్ గారి విమర్శకు సమాధానమిస్తూ, ఏ దేశం విదేశాంగ విధానమైనా జాతీయ విధానంగా వుండాలిగాని కేవలం ఒక పార్టీకి సంబంధించిన విధానం అయివుండరాదనే వాదంతో తాను ఏకీభవిస్తాననీ, కానింకా ఒక అడుగు ముందుకుపోయి అది అంతర్జాతీయ విధానంగా కూడా వుండాలని అంటాననీ, పండిట్ నెహ్రూ స్పష్టం చేశారు.

విదేశాలకు పంపే ప్రతినిధి వర్గాలలో సభ్యులను మధ్య మధ్య మారుస్తూ వుండాలనే సూచనకు జవాబిస్తూ ఏ దేశం ప్రతినిధి వర్గాన్ని తీసుకున్నా, పాతవారే సభ్యులుగా వుండటం పరిపాటి అనీ, ఏ పేటా సభ్యుల్ని మార్చటంవల్ల పని చెడిపోతుందనీ అన్నారు.

విదేశ వ్యవహారాలను గూర్చి ప్రతిపక్ష సభ్యులతో తరుచు సంప్రతింపులు జరపగలనని హామీ యిచ్చారు.

నేతాజీ సుభాస్‌చంద్రబోస్ మరణం సంగతి ప్రస్తావిస్తూ, ఆయన మరణించాడనే విషయమై తమకు ఎట్టి అనుమానము లేదనీ, భారతీయులకు ఎంతో ప్రీతిపాత్రుడైన ఈ మహాపురుషుణ్ణి గురించి పత్రికలు మధ్యమధ్య ఏవేవో నిరాధారమైన వదంతులు ప్రకటిస్తుండడం శోచనీయమనీ, అన్నారు. సింగపూర్‌లోను అక్కడా సుభాష్ చంద్రబోస్ పేరిట పోగుచేయబడిన నిధి విషయం ఎత్తి, ఈ నిధిలో హరించింది హరించగా 70, 80 వేల రూపాయల మొత్తాన్ని లార్డ్ మౌంట్‌బాటెన్ సహాయంతో తాను ఎలాగో రాబట్టగల్గాననీ, యిది సింగపూర్ విశ్వవిద్యాలయంలో భారతీయ విద్యార్థులకు ఉపకార వేతనాల నిమిత్తం ఇచ్చింద బడుతున్నదనీ తెలియజేశారు. "ఈ డబ్బు కాక ఆ నిధి తాలూకుది కొంత జవాహిరీకూడా వుంది. బాంకులలో దానిని భద్రపరిచాం. అనగలు ఏం చెయ్యాలో తెలియటంలేదు" అని నెహ్రూ అన్నారు.

దేశంలో స్థితిగతులు విషమిస్తే ప్రభుత్వంతో తాము సహకరిస్తామని డా॥ ముఖర్జీ అన్నమాటలను పట్టుకొని, ఆ వాగ్దానానికి తాను ఎంతైనా కృతజ్ఞుణ్ణి అనీ, స్థితిగతులు విషమించే టట్టు చేసి, అప్పుడు సహకరించేకంటే కాశ్మీర్ మొదలైన వ్యవహారాలలో ఆందోళనను విరమించి, అట్టి పరిణామం అసలు రాకుండా నివారించటం వివేకమనీ, పండిట్ నెహ్రూ

(5-వ పేజీ చూడుడు)

## ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గ సమావేశం

### సభ్యులకు ఢిల్లీ చర్చలపై సంజీవరెడ్డిగారి వివరణ

మద్రాసు, మార్చి 18: ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారి అధ్యక్షతను ఇవాళ మధ్యాహ్నం రెండు గంటలకు మద్రాసు శాసనసభల కాంగ్రెసుపక్ష కార్యాలయంలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యసంఘ సమావేశం ప్రారంభమైంది. సభకు అయ్యదేవర కాళేశ్వరరావు, మంత్రి నాయకంటి వెంకటరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, శ్రీమతి చోడగం అమ్మన్నరాజా, కడప కోటిరెడ్డి, మంతెన వెంకటరాజు, మొసుల సూర్యనారాయణమూర్తి, మాగంటి అంకినీడు, సంజీవరాయప్ప, బి. వి. కేశవరావు, పుచ్చలపల్లి రామారావు, నలగామపల్లె వెంగల్వరాయ నాయుడు, లంకలాపు లక్ష్మణనాయుడు, కొత్తలని వెంకటరత్నం, అల్లూరి సత్యనారాయణరాజు, ఆలూరి బాపినీడు, మొసలికంటి తిరుమలరావుగారలు హాజరైనారు.

ప్రత్యేకాహ్వానంపై కళా వెంకట్రావు, కల్లూరు సుబ్బారావు, కల్లూరి చంద్రమౌళి, మురుపిళ్ల చిట్టిగారలు హాజరయ్యారు.

ఢిల్లీలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి జరిగిన సంగతులను సంజీవరెడ్డిగారు కార్యవర్గ సభ్యులకు ఎరుక చేశారని తెలుస్తోంది.

కాంగ్రెసు కృషికార్‌లోక్‌పార్టీల మధ్య సహకార సాధనకై నెహ్రూ జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు సంజీవరెడ్డిగారు నేటి కార్యవర్గ సమావేశంలో సభ్యులకు చదివి వినిపించారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమై భారతప్రభుత్వ నిర్ణయం ఇంతవరకూ వెలువడని కారణంచేత, ఆ సమస్య చర్చకురాలేదు.

## ఇండియా పాకిస్తాన్ల వ్యాపార చర్చలు

### ముడిజనపనారపై పన్ను సమస్య పరిశీలన

న్యూఢిల్లీ, మార్చి 17: ముడిజనుము ఎగుమతులమీద పాకిస్తాన్ ప్రభుత్వం విధిస్తున్న పన్ను లైసెన్సురుసుముల విషయంగురించీ, బొగ్గు రేవుసుముల మీద ఇండియా విధిస్తున్న సర్‌ఛార్జీ గురించి ఇండియా పాకిస్తానుల ప్రతినిధి వర్గాలు ఈవేళ మళ్లీ చర్చలుసాగించాయి. కాని ఇంకా యీ విషయాలపై నిర్ణయంఅంటూ ఏదీజరగలేదు.

నేటిచర్చలలో ముఖ్యంగా ఇండియాకు పాకిస్తాన్ ముడిజనుము ఎంత కావాలి? పాకిస్తాన్‌కు ఇండియా నుండి బొగ్గు ఎంతకావాలి అనేఅంశాలను గూర్చి పరిశీలనజరిగింది.

ఇండియాకు పాకిస్తాన్ కొంతపత్తి కూడా సప్లై చేయాలని భారతప్రతినిధి వర్గం కోరింది; ఈ విషయాన్ని గురించిన చర్చలలో భారతప్రభుత్వం టెక్స్‌టైల్ కమిషనరుకూడా పాల్గొన్నారు. అయితే పాకిస్తాన్‌వద్ద ప్రస్తుతం ఇండియాలో మిల్లులకు కావలసిన రకాల పత్తి అట్టే నిలవ లేదని తెలుస్తున్నది.

## నెహ్రూ జయప్రకాశ్ సమాలోచనల వైఫల్యం

### త్వరలో అధికార ప్రకటన జరిగే సూచన

న్యూఢిల్లీ, మార్చి 17: కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీలమధ్య సన్నిహిత సహకారాన్ని సాధించే నిమిత్తం ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ, జయప్రకాశ్ నారాయణ్ గారలు జరుపుతున్న సంప్రతింపులు విఫలమైనట్లు తెలుస్తున్నది. జయప్రకాశ్ నారాయణ్‌గారు తమకు పండిట్ నెహ్రూకు జరిగిన సంప్రతింపులను గూర్చి రేపొక ప్రకటన చేయవచ్చు. ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ కూడా ఈ విషయమై రేపుగాని లేదా మార్చి 20వ తేదీన మీరట్‌లో జరిగే కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలోగాని ఒక ప్రకటన చేయవచ్చునని అంటున్నారు.

ప్రజాసోషలిస్టుపార్టీ ప్రతిపాదించిన కనీస కార్యక్రమం పండిట్ నెహ్రూకు అంగీకారయోగ్యమైనదిగా లేదనీ, అందువల్ల ఈ సంప్రతింపులు విఫలమయినవనీ తెలుస్తున్నది.

ప్రజాసోషలిస్టు పార్టీ ప్రతిపాదించిన కార్యక్రమంలోని ముఖ్యాంశాలు ఇవి:—

ఒకటి, నష్టపరిహారం ఇవ్వకుండా జమీందారీలను రద్దు చేయటం; అందుకుగాను రాజ్యాంగంలో భూమి సంస్కరణలకు సంబంధించిన క్లాజులను సవరించవలసి వుంటుంది. ఇదే కాక యింకా మరికొన్ని తీవ్రమైన యితర వ్యవసాయ సంస్కరణలను కూడా ప్రవేశపెట్టాలి.

రెండు, ఎగువసభలను రద్దుచేయాలి

మూడు, దేశంఅంతటా ఉన్నత పరిశ్రమల నిర్వహణార్థం సహకార సంస్థలను ఏర్పాటుచేయాలి.

నాలుగు, బాంకులను భీమాకంపెనీలను ప్రభుత్వపరం చేయాలి,

అయిదు, దేశంలో ఇప్పుడు జాతీయం చేయబడిన పరిశ్రమలు కాక, అదనంగా మరికొన్ని పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనపరచుకోవాలి.

ఆరు, పరిపాలనా వ్యవస్థను ఆమూలాగ్రంగా సంస్కరించాలి. ఉభయపక్షాల నాయకులు నిన్నటిరాత్రి సమావేశమై ఈ కార్యక్రమాన్ని గురించి దాదాపు ఒకగంటసేపు చర్చించారు. పండిట్ నెహ్రూ ఈ కార్యక్రమం ప్రస్తుతం ఆచరణ సాధ్యమైంది కాదని జయప్రకాశ్ నారాయణ్ గారికి సూచించినట్లు తెలుస్తున్నది.

కాంగ్రెసు అధిష్ఠానవర్గ సభ్యులలో అనేకమంది, ఈ ప్రాతిపదికపై ప్రజాసోషలిస్టుపార్టీతో తాము సహకరించటం వాంఛనీయంగాదని పండిట్ నెహ్రూకు గట్టిగా సలహా యిచ్చినట్లు తెలుస్తున్నది. జమీందారీ విధానం దేశంలో యిప్పటికే రద్దు అయిపోయిందనీ, ఇప్పుడు రాజ్యాంగానికి సవరణలను ప్రతిపాదించి లేనిపోని వివాదాలను లేవదీయటంవల్ల ప్రయోజనం ఏమీ లేకపోగా పంచవర్ష ప్రణాళిక నిర్వహణకు ఆటంకం కలుగుతుందనీ పండిట్ నెహ్రూ అభిప్రాయపడుతున్నట్లు తెలియవచ్చింది.

ఏమైనా ఈ విషయాలన్నీ కూలంకషంగా సావధానంగా ఆలోచిస్తేనే గాని తేలేవికావు గనుక నిన్నటి సమావేశంలో దీనినిగురించి ఖచ్చితమైన నిర్ణయం అంటూ ఏదీ జరగనట్లు తెలుస్తున్నది. ఉభయపార్టీల నాయకులు మళ్లీ సమావేశం అవుతారా? లేదా? అయితే యెప్పుడు అవుతారు? అనే విషయం యిదమిత్థంగా ఏమీ తెలియరాలేదు.

ప్రజా సోషలిస్టుపార్టీ కార్యవర్గ సమావేశానికి హాజరయే నిమిత్తం జయప్రకాశ్ నారాయణ్ గారు ఢిల్లీనుంచి 19వ తేదీన బొంబాయి వెళ్తారు.

పండిట్ నెహ్రూ ప్రజాసోషలిస్టు పార్టీతో సహకారం సాధించాలని ప్రారంభ దశలో చాలా ఆతురత కనపరచారని, కాని ఆయన సహచరులు తాము సూచించిన తీవ్రమైన సంస్కరణలకు అంగీకరించకపోవటంతో తాము మొదట్నుంచీ అనుకూలంగానే వున్నామని ఒక ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుడు వ్యాఖ్యానించారు.

### సమితి ప్రధాన కార్యదర్శి పదవి

#### బి. ఎన్. రావుగారి పేరునమోదు

యునైటెడ్ నేషన్స్, మార్చి 18: సమితి కార్యదర్శి పదవికి ఇంతవరకు అనుకుంటున్న వ్యక్తులపేర్లు గాక మరి రెండు కొత్తపేర్లు నేడు చేరాయి. అవి (1) శ్రీ బి. ఎన్. రావు (2) అహ్మద్ బుఖారీ.

### వెనుకబడిన జాతుల కమిషన్

#### సమావేశానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, మార్చి 18: వెనుకబడిన జాతుల తాలూకు కమిషన్‌ను రాష్ట్రపతి రాజేంద్రబాబు నేడు ప్రారంభించారు. ఈ కమిషన్ వారికి అన్నివిధాలా తోడ్పడవలసిందని ఆయన ఈ సందర్భంలో దేశస్థుల నందరినీ అడిగారు.

ఈ ప్రారంభోత్సవానికి ప్రధాని నెహ్రూ, హోంమంత్రి డా॥ ఖట్జూ ప్రభృతులు హాజరైనారు.

## అమెరికాలో కొత్తరకం అణుపరికరం ప్రేలుడు

లాస్‌వేగాస్ (నివేడా), మార్చి 17: అమెరికా నేడు యుక్కా ప్రాంతంలో ఒక కొత్తరకమైన ఉపకరణాన్ని పేల్చి, పరిశోధించింది. ఇది 'అణుయుద్ధ' మూలక పరికరం కాదు. ప్రేలుడు జరగగానే దీని వేడికి అదొక ఒక బురుజు (300 అడుగుల ఎత్తుగలది.) ఆవిరిగా మారిపోయింది. దీని పేల్చుటకోటికి రెండు మైళ్లదూరంలో సైనికులను నిలిపి ఉంచి పెట్టారు. వారికి ఎట్టి అపాయము జరగలేదు.

ఇది హైడ్రోజన్‌బాంబుకన్నా చిన్నది. అణుబాంబుకన్నా శక్తివంతమైంది. ... అయితే హైడ్రోజన్ బాంబుకన్నా ... శక్తివంతమైన బాంబునుండి ... రక్షణ ... ప్రయోగాలు జరిపారు. ప్రస్తుతం ఈ ఉపకరణాన్ని అమెరికా ... ప్రయోగించటానికి ... అని చెప్పారు.

### ప్రావ్డా వ్యాఖ్య

మాస్కో, ఫిబ్రవరి 17: అమెరికా రష్యాలమధ్య వున్న తగాదాలన్నీ శాంతియుతంగా, సమాలోచనల ద్వారా పరిష్కార సాధ్యాలయినవే అని నేడు రష్యన్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'ప్రావ్డా' వ్రాసింది.

## మున్సిపల్ కార్మికులకు ఇంటిఅద్దె అలవెన్సు

### —ప్రభుత్వ పరిశీలన

మద్రాసు, మార్చి 18: మునిసిపలు కార్మికులకు ఇంటి అద్దె అలవెన్సు ఇచ్చే విషయం ప్రభుత్వంవారి పరిశీలనలో వుందని స్థానికపాలన మంత్రి శ్రీ శంకరరెడ్డి నేడు అసెంబ్లీలో చెప్పారు.

శ్రీ యం. వీరభద్రం ప్రశ్నకు సమాధానం ఇస్తూ విజయవాడ మునిసిపాలిటీ వారి 1953/54 సంవత్సరం బడ్జటు ప్రభుత్వానికి అందలేదనికూడ తెలియజేశారు.

శ్రీ వీరభద్రం: కార్మికులకు ఇంటి అద్దె గురించి విజయవాడ మునిసిపాలిటీవారి సూచనను అంగీకరించి మంజూరు చేయుదురా?

స: ఇప్పటు అందినప్పుడు ఆ విషయమై పరిశీలించగలము.

శ్రీ కె. గోవిందరావు: మునిసిపలు కార్మికులకు ఇంటి అద్దె అలవెన్సు ఇవ్వాలని అనేక మునిసిపాలిటీలు కోరుచున్నందున త్వరలో ఈవిషయం తేల్చగలరా?

స: మునిసిపలు కార్మికులకు ఇంటి అద్దె ఇచ్చే విషయం ప్రభుత్వంవారి ఆలోచనలో వుంది.

## కాంచట్కాపై సోవియెట్, అమెరికన్ విమానాల యుద్ధం

### ఉత్తర పసిఫిక్ సముద్రప్రాంతంలో సంఘటన

వాషింగ్టన్, మార్చి 17: "కాంచట్కా తూర్పు తీరంలో ఒక అమెరికన్ గస్తీ విమానానికి రష్యా తాలూకు మిగ్ 15 రకం విమానానికి పోరాటం జరిగింది," అని అమెరికా విమానశాఖ కార్యాలయంవారు నేడు ప్రకటించారు.

కాంచట్కా రష్యాలో ఒకభాగం. అమెరికాలో అలాస్కాకు ఎదురుగుండా రష్యాలోవున్న ప్రాంతం. దానికి దీనికి అడ్డం బేరింగు సముద్రం. ఇప్పుడు ఈ రెండు విమానాలకు ఈ పోరాటం సైబీరియా ద్వీపకల్పానికి తూర్పుగా 25 మైళ్ల దూరంలో ఉత్తర పసిఫిక్ మహాసముద్రం మీద జరిగింది.

ఈ ప్రాంతంలో ఈ విమానాన్ని కాల్చడం అయితే రెండు రష్యా విమానాలు తారసిల్లాయిగాని, అందులో ఒక్కటి మాత్రమే ఈ విమానంమీదకు వచ్చి కాల్పులు సాగించింది. అమెరికన్ బాంబరు తిరిగి కాల్పులు సాగించింది.

అమెరికా విమానం ఆకాశంలో రష్యాసరిహద్దులకు 25 మైళ్ల దూరంలో సముద్రంమీదుగా ఎగురుతున్నదనీ, రష్యా సరిహద్దులను అతిక్రమించినట్టు కానరాలేదు. అంతర్జాతీయ జలాలమీదుగా ఇది ఎగురుతున్నది.

న్యూఢిల్లీ, మార్చి 17: జనసంఘ్ ప్రభృతి సంస్థల ఆందోళన సందర్భంలో నేడు 10 మంది అరెస్టు చేయబడ్డారు.

# రాష్ట్ర వార్తలు

### తణుకు

ఇక్కడ పోస్టల్ రిక్రియేషన్ క్లబ్బును డివిజనల్ సూపరింటెండెంటు, జనాబ్ ఎం. ఎ. హాదీగారు ప్రారంభోత్సవం జరిపారు. క్లబ్బు కార్యదర్శి కనకరాజుగారు, పోస్టల్ ఉద్యోగులకు విశ్రాంతి నిలయంగా యీ క్లబ్బును ఏర్పాటు చేసుకున్నామని, అధికారులు ఉదారంగా గ్రాంటు యివ్వాలని కోరారు. హాదీగారు తమ శక్తివంచన లేకుండా సహాయం చేస్తామని చెప్పారు. టీపార్టీ విందు ఫోటో, అనంతరం సభ ముగిసినది.

### నెల్లూరు

పోస్టల్ సర్వీసెస్ డైరెక్టరు యం. బాసుగుప్తాగారికి, నెల్లూరు చైర్మన్ ఎ. వి. సుబ్బారెడ్డిగారికి పోస్టాఫీసు గుమాస్తాలు, యీ 8వ తేదీ ఉదయం పోస్టాఫీసు ఆవరణలో అల్పాహార విందు చేశారు. నెల్లూరు సర్కిల్ పోస్టల్ సూపరింటెండెంటుగారు, బాసుగుప్తా, ఎ. వి. సుబ్బారెడ్డిగార్లకు స్వాగతం చెప్పారు. ఈ యిద్దరిని అభినందిస్తూ వై. కె. వరదాచారి, టి. బాలకృష్ణయ్య, ఆర్. వి. రాజశేఖరం గార్లు మాట్లాడారు.

పోస్టాఫీసు భవనం ఈస్టిండియా కంపెనీ పరిపాలన కాలంనాటిదని, చీకటి కొట్టు ఉన్నదని కొత్త మంచి భవనం కట్టించాలని డైరక్టరుగారిని కోరారు. ఆ సౌకర్యం త్వరలో చేకూరగలదని డైరెక్టరుగారు హామీ యిచ్చారు. గుప్తాగారు, సుబ్బారెడ్డిగారు, తమ కొసంగిన గౌరవమునకు కృతజ్ఞత తెలిపారు.

### కూర్మాపురం

కమ్యూనిటీ ప్రాజెక్టు సభ ఈ గ్రామంలో శ్రీ మేకా. సుబ్బారావుగారి అధ్యక్షతన 12వ తేదీ జరిగినది. శ్రీ మాగంటి బాపినీడు ప్రజలు ప్రభుత్వంతో సహకరించాలని విజ్ఞప్తిచేశారు. శ్రీ శేషగిరిరావుగారు గ్రామంలో మంచినీటి చెరువు బాగు చేయించాలనీ, పాఠశాలభవనం నిర్మించాలనీ అందుకు గ్రామస్థులు కొంత విరాళ మివ్వగలరనీ అన్నారు.

### తెనాలి

శ్రీ వెంకట గౌరీశంకర నాట్యమండలి సాధారణ సమావేశం శ్రీ పి. యస్. ఆర్. శాస్త్రిగారి అధ్యక్షతన జరిగింది. సంఘ నియమావళిని మార్చుటకు శ్రీయుతులు యం. వి. సుబ్రహ్మణ్యంగారిని అధ్యక్షులుగను, యామలూరు శ్రీ రామమూర్తి, వి. సూర్యనారాయణగార్లను సభ్యులుగను ఒక ఉపసంఘ మేర్పాటు చేశారు.

### చీరాల

రాజమండ్రి పత్రిక ప్రముఖులు శ్రీ తెనర్తి వెంచు పున్నయ్య శ్రేష్ఠిగారి మరణానికి తమ సంతాపం ప్రకటిస్తూ యిక్కడ శ్రీ కోట గోవిందరాజులు గారి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో తీర్మానించారు.

### పాటిబండ

సత్తెనపల్లి తాలూకా పాటిబండ గ్రామంలో మద్రాసు శాసన సభ్యులు వర్ని లక్ష్మయ్యగారి అధ్యక్షతన యీ నెల 8వ తేదీన బహిరంగసభ జరిగింది. శ్రీయుతులు వెంక్కపాటి సుబ్బారావు, వర్ని లక్ష్మయ్యగార్లు సభలో ప్రసంగించారు.

### సామర్లకోట

పెద్దాపురం, సామర్లకోట, పరిసర గ్రామాల పొగాకు వర్తకులు 7వ తేదీన సమావేశమై పొగాకు వర్తక సంఘం స్థాపించారు. దీనికి శ్రీ గంజి పెదమాల్లు అధ్యక్షులు. తెంగవరపు సత్యనారాయణ, ఉపాధ్యక్షులు, బుద్దాల వీరభద్రరావు, కార్యదర్శి, వందమూరి ముంగయ్య, కోశాధికారి. పొగాకుపై రాష్ట్రప్రభుత్వం విధించదలచిన అమ్మకపు పన్నును ఉపసంహరించుకోవాలనీ రాష్ట్రప్రభుత్వములకు కేంద్ర ప్రభుత్వమువారు అట్టి అధికారము కలుగజేయరాదనీ తీర్మానించారు.

### హాస్పేట

సర్దార్ వల్లభాయిపటేల్ స్మారక ఉన్నత పాఠశాల ద్వితీయ వార్షికోత్సవం అసిస్టెంటు కలెక్టరు శ్రీ సుందరంగారి అధ్యక్షతన 10 తేదీన జరిగినది. కార్యదర్శి నివేదిక చదివారు. పలువురు ఉపన్యసించినపిదప ఆటల పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు.

### కర్నూలు

జిల్లా యువజన ఫెడరేషన్ కార్యవర్గ సమావేశం 7వ తేదీన దుర్వేశి గ్రామంలో శ్రీ టి. నరసింహయ్యగారి అధ్యక్షతన జరిగినది. తాలూకాల ప్రతినిధులు నివేదికలు సమర్పించిన పిదప కార్యవర్గసభ్యుల ఎన్నిక జరిగింది. అనంతరం సిద్ధేశ్వరం - గండికోట, తుంగభద్ర ఎగువ కాల్వలనిర్మాణం వెంటనే జరగాలనీ, అగ్రరాజ్య పంచకం యుద్ధ వ్యతిరేక సంధిని చేసుకోవాలనీ తీర్మానించారు. సభవారు స్టాలిన్ స్మృతికి సంతాపం ప్రకటించారు.

### చెరుకుపల్లి

పొన్నపల్లి గ్రామ పంచాయతీ బోర్డు అధ్యక్షులున్ను, కమ్యూనిస్టు పార్టీవారు కలసి 7వ తేదీన మార్షల్ స్టాలిన్ స్మృతికి సంతాప సూచకంగా సభ జరిపారు. మార్షల్ స్టాలిన్ చరిత్ర గురించి పలువురు ఉపన్యసించిన పిదప సంతాపతీర్మానం ఆమోదించారు.

# గుంటూరులో నీటిఎద్దడి నివారణోపాయం

## ప్రభుత్వానికి పురపాలక సంఘం విజ్ఞప్తి

గుంటూరు, మార్చి 16: కొమ్మమూరు కాల్వనుండి, రిజర్వాయర్లలోకి నీటిని పంపులద్వారా సరఫరా చేసేందుకు ప్రభుత్వం వెంటనే అవసరమైన చర్యలు తీసుకోవాలని స్థానిక పురపాలక సంఘంవారు ప్రభుత్వాన్ని అర్థిస్తు తీర్మానం చేశారు. చైర్మన్ చేబ్రోలు హనుమయ్యగారి అధ్యక్షతన, మొన్న సాయంకాలం జరిగిన అత్యవసర సమావేశంలో జి. వి. పున్నయ్యశాస్త్రి గారు యీ తీర్మానం ప్రతిపాదించారు. అందులో రాయలసీమలో నీటికరవు నివారణకు తీసుకొన్న చర్యలను, గుంటూరు పట్టణ విషయంలో కూడా ప్రభుత్వం తీసుకోవాలని, యిందు నిమిత్తం ప్రభుత్వాన్ని 8 లక్షల రూ.లు గ్రాంటుగా అడగాలని, కొమ్మమూరు కాల్వను ప్రభుత్వం ఏప్రిల్ 15వ తేదీ వరకైనా తెరచి ఉంచడం అవసరమని, రైల్వేవాగన్లద్వారా నీటిని సరఫరా చేయవలసిందిగా రైల్వే అధికార్లను ప్రభుత్వం ఆదేశించవలెనని, పేర్కొనబడింది.

ఈ తీర్మానాన్ని, యిక్కడకు రానున్న గవర్నరుకు సమర్పించే స్వాగతపత్రంలో నమోదుపర్చాలని, ఎన్. వి. ఎల్. నరసింహారావుగారు సవరణ ప్రతిపాదించారు. గవర్నరుకు సమర్పించదలచిన, స్వాగత పత్రం తయారుచేయడం పూర్తిఅయి ఒక ప్రతిగవర్నరుకు పంపడం గూడా జరిగిందని, కాబట్టి యిప్పుడు యీ తీర్మానాన్ని, స్వాగతపత్రంలో పొందుపరచడం సాధ్యం కాదని పున్నయ్య శాస్త్రి గారు సమాధాన మిచ్చారు. తీర్మానాన్ని, గవర్నరుగారు గుంటూరుకు బయలుదేర బోయే ముందుగా, వారికి పంపవచ్చుననికూడా శాస్త్రిగారు సూచించారు.

ఈ తీర్మానాన్ని ఓటుకు పెట్టగా అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడినది. అంతకుముందు, పట్టణంలో నీటి ఎద్దడి గురించి, తీవ్రంగా చర్చ జరిగింది. సమావేశ ప్రారంభంలో కమీషనర్ ఎస్. అంకన్నగారు, నీటిని సరఫరాచేసేందుకు సంకల్పింపబడిన పైలట్ స్కీము భగ్నమవడానికిగల కారణాలను వివరించారు.

సివిల్ సప్లయిస్ లారీలద్వారా పట్టణంలో నీటిపంపకం పద్ధతిని జొన్నలగడ్డ రామలింగయ్యగారు నిశితంగా విమర్శించారు. ఈ లారీలు అధికారులకు, పలుకుబడిగల వ్యక్తులకు పుష్కలంగా నీటిని సప్లయి చేస్తూ, మామూలు జనానికి కొరగాకుండా వున్నవని ఆరోపించారు. ఉన్నతాధికారులకు వందలకొద్దిబిందెలనీళ్ళు దొరకుతుంటే, బీదజనానికి కుండెడునీళ్లుగూడా దొరకడం లేదనుటకు తగినసాక్ష్యం వున్నదని రామలింగయ్యగారన్నారు.

17వ తేదీన గవర్నరుగారు యీ పట్టణానికి వచ్చినపుడు, ఖాళీ కుండలను ఆయనకు ప్రదర్శించాలని జి. కోటయ్యగారు సూచించారు.

నీటి ఎద్దడివల్ల గుంటూరులో, అత్యవసర పరిస్థితి యేర్పడ్డటుగా ప్రకటించి విద్యాలయాలను, హోటళ్ళను, సినిమాలను, పొగాకు కంపెనీలను మూసివేసి, తద్వారా బయట ఊళ్ళ జనసమ్మర్దం తగ్గించాలని డా॥ ఎస్. మల్లిఖార్జునరావుగారు అన్నారు.

వై. తిరుపతియ్య (కమ్యూనిస్టు) గారు మాట్లాడుతూ, యీ పురపాలక సంఘం, నీటికరవు నివారణ విషయంలో ఏమీ చేయజాలదని, అదిచేస్తాం, యిదిచేస్తాం అని ప్రజలకు లేనిపోని ఆశలు కల్పించవద్దని నీటికరవు యింతలో తీరతాక కల్పించడంలేదని హెచ్చరించారు. పట్టణంలో నీటికరవు ఏర్పడడానికి ప్రభుత్వ నిర్లక్ష్యమే కారణమని, అందువల్ల ప్రజలు పన్నులు కట్టవద్దని, అవసరమైతే సత్యాగ్రహం చేయాలని సూచించారు. కార్మికజనానికి తిండి కావాలంటే నీళ్లుండవు, నీళ్లు కావాలంటే తిండివుండదు అని తిరుపతియ్యగారు అన్నారు.

ఇంకా రెండులక్షల రూపాయలు గ్రాంటు మంజూరు చేయాలని, 10 సివిల్ సప్లయిస్ లారీలను యిప్పించాలని ప్రభుత్వాన్ని అడుగవలసినదిగా సూచించారు.

కె. సీతారామయ్య, జె. జోషి, కె. నారాయణ, ఎ. దామోదరరావు, కె. వి. రెడ్డి, ఆర్. నాగయ్య, జె. లక్ష్మీనారాయణ ప్రభృతులు గూడా చర్చలో పాల్గొన్నారు.

## అన్నంలో విషప్రయోగం: బాలిక దుర్మరణం

కాళహస్తి, మార్చి 16: ఇక్కడి పద్మసాలిపేటలో మంగమ్మ అను బాలిక (4 సం॥ రాలు) అన్నము తిని వాంతులవల్ల చనిపోయినది. ఆ అన్నములో ఏదో విషము కలిపినట్లు అనుమానింపబడినది. మంగమ్మ, ఆమె అక్క వెంకటమ్మ (10 సం॥రలు) ఇద్దరు అన్నము తిన్నారు. వాంతులతో ప్రమాదస్థితిలో ఉండగ, తండ్రి, వాళ్లిద్దరినీ ఆస్పత్రికి తీసుకొని వెళ్ళారు. మంగమ్మ చనిపోయినది. వెంకటమ్మ కోలుకొన్నది. ఈ సందర్భంలో అనుమానంపై పోలీసులు ఒకనిని అరెస్టుచేసి, దర్యాప్తు జరుపుతున్నారు. (స్వ. వి)

## దాచినసొమ్ము చూపిస్తానని పోలీసు ప్రాణాలు తీసిన దొంగ

### మదనపల్లె సమీపంలో విషాద సంఘటన

మదనపల్లి, మార్చి 16: ఒక దొంగతనం కేసులో అనుమానించబడుతున్న ఒక దొంగను, ఇద్దరుపోలీసులు దొంగసొమ్ము చూపించమని అడగ్గా, అతను వారిని ఒక నిర్జనస్థలంలోవున్న నూతి వద్దకు తీసుకుని వెళ్లి నూతి అట్టడుగున అన్ని వస్తువులు భద్రంగా వున్నాయని అన్నాడుట. ఒకపోలీసు పాపం యీ మాటలునమ్మి బావిలోపలికి తొంగి చూశాడు. ఇది కనిపెట్టి ఆ దొంగ అమాంతంగా అతన్ని నూతిలోకి తోసేశాడు. వెంటనే ఆ పోలీసు ప్రాణాలు కోల్పోయాడు. దొంగ తప్పించుకుని పారిపోదామని చూశాడు కాని రెండవపోలీసు అతన్ని పట్టుకున్నాడు అతికష్టంమీద. మదనపల్లెకు దగ్గరలోవున్న నిమ్మనపల్లెవద్ద యీ విషాదసంఘటన జరిగింది.

(పి. టి. ఐ.)

## నెహ్రూ నాయకత్వం

### రంగాగారి అభినందన

విజయవాడ, మార్చి 16: "ఏ యితర వ్యక్తి కాదు, సంస్థ కాదు-ప్రధాని నెహ్రూ నాయకత్వమే అసంఖ్యాక ప్రజానీకానికి ఆమోదం కూర్చి వారి సహకారం పొందగలిగింది. ఆయన నాయకత్వంక్రిందనే ప్రజల ఆర్థికాభివృద్ధికి యితోధిక ప్రజాసహకారం లభించగలదు. ప్రజాస్వామిక పక్షాల పరస్పర సహకారం కూడ యిందుకు కారణమే. గడచిన ఎన్నికలు జరుగుతున్నపుడు, అనంతరం కూడ జరిగిన ఘటనలు యీ సత్యాన్ని విశదం చేశాయి.

"పంచవర్ష ప్రణాళిక జయప్రదం కావడానికి నెహ్రూ నాయకత్వం కింద ప్రజాస్వామిక పక్షాలన్నీ కలిసి మెలిసి వుంటూ, బాధ్యతలు పంచుకోవాలి. అప్పుడను యీ ప్రణాళిక కన్న యింకా ఎక్కువ కార్యాలు కూడా మనం సాధించగలమన్న విశ్వాసం నాకున్నది. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోను, మిశ్రమ మంత్రివర్గాలు యేర్పడాలని నేను చేసిన విజ్ఞప్తిని రాజాజీ బలపరచినందుకు చాలా సంతోషిస్తున్నాను" అంటూ రంగాగారు నేడిక్కడ పత్రికా ప్రతినిధులతో సంభాషిస్తూ అన్నారు.

## సంస్కృత పండితునికి సమ్మానం

అమృతసర్, మార్చి 17: సంస్కృత విశ్వపరిషత్తు కార్యదర్శి బ్రహ్మశ్రీ శ్రీ టి. ఎ. వెంకటేశ్వర దీక్షితులు గారికి గుంతకల్లు స్టేషనులో పట్టణ కాంగ్రెసు ఉపాధ్యక్షులు, పండితులు యితర ప్రముఖులు సమ్మానం జరిపారు. అందరిని పరిచయం చేసిన పిమ్మట, శ్రీ దీక్షితులవారు పరిషత్తు ఆశయములను వివరించారు.

## మైసూరు సంస్థానంలో చేరడానికి హేమావతి ప్రజల అసమ్మతి

మడకశిర, మార్చి 14: మడకశిర తాలూకా హేమావతి గ్రామంలో యీ నెల 11వ తేదీన అమిదాల గొండిపి అనంతరాజుగారి అధ్యక్షతన సభజరిగింది. కాంగ్రెసు ప్రభుత్వం ఇంతవరకు దేశానికి చేసిన సేవను గురించి అనంతరాజుగారు, గొల్లపల్లి రామశాస్త్రిగారలు సభలో వివరంగా వుపన్యసించారు. తదనంతరం మడకశిర తాలూకాను మైసూరు సంస్థానంలో చేర్చుతారని తెలుస్తున్నదనీ, ఆ విషయంగురించి మా అభిప్రాయమేమని సభవారలనడుగగా అందుకు తాము పూర్తిగా వ్యతిరేకులమని ప్రజలు సభలో అన్నారు. పి. విశ్వనాథయ్యగారి కృతజ్ఞతాభివందనలతో సభముగిసింది. అతిథులకు హెచ్. లింగగౌడుగారు విందు చేశారు.

(స్వ. వి.)

## టిక్కెట్టులేని ప్రయాణీకులకు జరిమానాలు, శిక్షలు

విజయవాడ, మార్చి 15: ఈ నెల 12వ తేదీన [illegible] రైళ్ళలో 181 మంది టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్నవారిని విజయవాడ రైల్వే స్టేషనులో పట్టుకున్నారు. వీరిలో 158 మందినుండి రు. 390 లు అపరాధముగా వసూలు చేయబడింది. మిగతా 88 మందిని రైల్వే మేజిస్ట్రేటుగారివద్దకు విచారణకు పంపగా వారికి 8 నుండి 10 రోజులవరకు శిక్షలను విధించారు.

టిక్కెట్టులేని ప్రయాణీకులను పట్టుకొనుటకు జరిగిన ఈ దాడిలో రైల్వే ఎ. టి. యస్. శ్రీ సి. కృష్ణ అయ్యర్, రైల్వేపోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ ఓ. శేషాచలయ్య, మరి 20 మంది టిక్కెట్టుకలెక్టర్లు, కొందరు పోలీసులు పాల్గొన్నారు. (స్వ. వి.)

## ఇద్దరు ఒరిస్సా శాసన సభ్యుల ఎన్నిక రద్దు

### ట్రిబ్యునల్ తీర్పు

బరంపురం, మార్చి 17: ఒరిస్సా శాసనసభకు బరంపురం బహుళ నియోజకవర్గంనుంచి ఎన్నికైన శ్రీయుతులు దండపాణిదాసు, రామచంద్ర మిశ్ర గార్ల ఎన్నిక చెల్లనేరదంటూ ఎన్నికల విచారణ సంఘంవారు తీర్పు చెప్పారు.

దండపాణిదాసుకు చాలినంత వయసు లేదనీ, పైగా క్రమవిరుద్ధమైన చర్యలద్వారా రెండవవానితో కలిసి పలుకుబడిని వుపయోగించాడనీ, దండపాణిదాసు మరో 6 సం॥ ల వరకు ఎన్నికలో పోటీ చేయరాదనీ తీర్పులో పేర్కొన్నారు. రెండవ వాని నేరం సామాన్యమవడంచేత శిక్షా విధించలేదు. ఇద్దరూ కలిసి శ్రీ గాడ నారాయణమూర్తికి ఖర్చులకింద రు 100/-లు యివ్వాలనీ, పిటిషనరు బాహాన్ నాయక్ కు రు 500/-లు యివ్వాలనీ కూడ తీర్పు చెప్పారు.

## మడకశిర తాలూకాలో శిస్తు వసూళ్లు వాయిదా వేయాలని

### తాలూకా కాంగ్రెసు అభ్యర్థన

మడకశిర, మార్చి 17: ఈ ఫిర్కాలో అనేక గ్రామాలలో క్షామం తీవ్రరూపం ధరిస్తున్నందున, పంటలు చెడినందున, శిస్తు వసూళ్లు, తక్కావీ వసూళ్లు వెంటనే తాలూకా అంతటా వాయిదా వేయాలనీ, చెరువులు మరమ్మతు, రోడ్డు పనులు ప్రారంభించి పేదలకు పనికల్పించాలనీ జిల్లా కలెక్టరును కోరుతూ 11వ తేదీన జరిగిన తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు. రాజాజీ రాజకీయ బాధితులపట్ల అనుసరిస్తున్న విధానాన్ని విమర్శిస్తూ, యీవిధానం యిదివరలో భూములు పుచ్చుకున్న రాజకీయ బాధితులకు కూడ వర్తింపజేయాలనీ, కాని పక్షంలో యీ సమస్యను పునఃపరిశీలించాలనీ, తీర్మానించారు. ఆంధ్ర రాజధాని విషయమై రాజాజీ వైఖరిని తీవ్రంగా ఖండించారు.

## వెంకట్రామన్ పై 'లంచగొండి' ఆరోపణ

### దర్యాప్తు మార్చి 26 కువాయిదా

న్యూఢిల్లీ, మార్చి 17: లోగడ భారత ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమలశాఖ కార్యదర్శిగా వుండిన ఎస్. ఎ. వెంకట్రామన్ పై ఆరోపింపబడిన లంచగొండితనం నేరం తాలూకు దర్యాప్తు డిఫెన్సు వకీలు కోరికపై ఈ నెల 26 కి వాయిదాపడింది. లోగడ కలకత్తా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వుండిన సర్ ట్రెవర్ హారీస్ దర్యాప్తుజరుపుతారు. నిందితుని తరఫున పార్లమెంటులో కాంగ్రెసు సభ్యుడైన ఎ. కె. బాసు వాదిస్తారు. ప్రభుత్వం తరఫున అటోని చటర్జీ వాదిస్తారు.

## పేదహరిజనులకు పోరంబోకు భూములు

### రివెన్యూ మంత్రికి విజ్ఞప్తి

మద్రాసు, మార్చి 18: వేముల కూర్మయ్యగారి అధ్వర్యాన ఒక రాయబారవర్గంవారు మద్రాసుప్రభుత్వ రెవెన్యూ మంత్రికి ఇతర మంత్రులకు గవర్నమెంటువారి పోరంబోకు భూములను పేద హరిజనులకు ఇచ్చే పద్ధతిలో ఇంకా చూడవలసి ఉన్నదని సూచించారు. రొంపేడు భూములు 4000 ఎకరాలు పేదకూలీల స్వాధీనం కింద కొంతకాలంగా వుంటున్నదనీ, వాటికి మార్కెట్టు విలువ ప్రకారం డబ్బు వసూలు చేయడం న్యాయంగాదనీ వారి విజ్ఞప్తిలో తెలిపారు. పూర్వ ప్రభుత్వం ఉచితంగా భూములను ఇచ్చారనీ, ఈ ప్రభుత్వం యీ విధంగా చేయడం బాగుండలేదనీ సూచించారు. ఇందువల్ల సస్యాభివృద్ధి కార్యక్రమం దెబ్బతింటుందనీ, కాంగ్రెసుకూడా దెబ్బతింటుందనీ సూచించారు: రాయబార వర్గంలో మాతలపాటి జోసెఫ్, వి. వి. కేశవరావు, కమతం షణ్ముగం, పాల వెంకటసుబ్బయ్య, కె. కాంతప్ప, మల్లయ్య మున్నగువారలు వున్నారు.

### ప్రకటన

ఆర్డరు నెం. 83/ 28-1-1953.

గుంటూరు జిల్లా, ఒంగోలు గ్రామంలోని శ్రీ కోదండరామస్వామి దేవస్థానము తాలూకు పెడుగ్గాలు దాఖలా ఇల్లు విక్రయించుటకు ట్రస్టీలకు అనుమతి యివ్వడమైనది. సదరు వేలం విషయం కరపత్రాలద్వారా ప్రచారం చేయించి బహిరంగ వేలములో అప్ సెట్టు విలువ రు. 4,000/-లతో, అసిస్టెంటు కమీషనరు హెచ్. ఆర్. & సి. ఇ. గుంటూరువారి సముఖములో విక్రయించవలెను. వేలము, కమీషనరు గారి ఖాయపు ఉత్తర్వులకు లోబడి యుండును.

షెడ్యూలు: ఒంగోలు గ్రామం అసెస్మెంటు నెం. 3399, 9-వ వార్డు నెం. 46/31 కల యిల్లు.

టి. యం. చిన్నయ్య పిళ్లై,
కమీషనరు,
హిందూ రిలిజియస్ & చారిటబుల్ ఎండోమెంట్సు, మద్రాసు-17.

## మన్కాడ్‌కి బంగారు క్రికెట్ బాట్

జార్జిటౌను, మార్చి 18: భారతీయ క్రికెట్ జట్టులో బాటింగ్, బౌలింగ్ రెండిటా సమమైన ప్రజ్ఞ, ప్రతిభ చూపుతూ, 'సవ్యసాచి' అని పిలుచుకొంటున్న వినూమన్కాడ్‌కు ఒక భాగ్యవంతుడు బంగారు బాట్ బహూకరించాడు. ఇండియా వెస్టు ఇండీస్ జట్టుల గౌరవార్థం జరిగిన ఒక విందులో ఈ బహుమతి ఇవ్వబడింది. విందుకు మన్కాడ్ హాజరుకాలేకపోవటంవల్ల ఆయన తరపున భారతీయ జట్టు నాయకుడు వి. ఎస్. హజారే బహుమతిని స్వీకరించారు.

## ఒంగోలు పురపాలక సంఘం

### బావులకు సంబంధించిన ఎస్టిమేట్లు మంజూరు

ఒంగోలు, మార్చి 16: క్రిందటి గురువారం (12వ తేదీ) సాయంకాలం చైర్మన్ తాతా లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన జరిగిన స్థానిక పురపాలక సంఘ సమావేశంలో, కమీషనర్ సూచనప్రకారం, ఏనాది కాలనీలో ఒక బావికి, వుప్పరి నాగయ్యగారి బావికి, ఎస్టిమేట్లు మంజూరు చేస్తూ తీర్మానం చేశారు.

ఈ తీర్మానాన్ని ఆమోదించే పూర్వం కౌన్సిలర్లు కరవది పట్టాభిరామయ్య, డా॥ చెన్నై రామకృష్ణయ్య, శృంగారపు పీతాంబరయ్య నాయుడుగారలు ప్రసంగిస్తూ, కమీషనరుగారు, ముందుగా కౌన్సిలు ఆమోదం పొందకుండానే తమ యిష్టానుసారము పట్టణంలో, కట్టడములు బావులు వగైరా పనులు చేయిస్తున్నారని, ఒక పనిని కొన్ని భాగములుగా చేసి పనులు పూర్తిఅయినతర్వాతగాని పనులు జరుగుతుండగాగాని, పురపాలక సంఘ ఆమోదమునకు పెట్టుట చట్ట విరుద్ధమని, ప్రస్తుత అంశమైన యీ బావుల విషయంలోగాక, యిదివరలో అనేక సమావేశాలు జరిగినప్పటికీ, పురపాలక సంఘం ఎదుట పెట్టకుండా, యిప్పుడు యీ పనులకు ఎస్టిమేట్లు మంజూరు చేయమని కోరడం చట్ట విరుద్ధమని ఆరోపించారు. చైర్మన్ పార్టీ తరఫున కె. వీరాస్వామిగారు సమాధానమిస్తూ, యీ బావుల విషయం యింతకుముందు సమావేశాలలో సభ్యులకు తెలియపరచబడినదనియూ, పనులు సాగుతున్నందున ఎస్టిమేట్లు మంజూరు చేయవలెనని అన్నారు. చైర్మన్ గారు కూడా కమీషనర్ ప్రతిపాదనను బలపరచారు. ఓటింగుకు పెట్టగా, ఎస్టిమేట్లు మంజూరు అయినవి.

శ్రీ కరవది పట్టాభి రామయ్య ప్రభృతులు తమ ఆక్షేపణలను రికార్డు చేయవలెనని కోరగా, ఆ ప్రకారం చైర్మన్ గారు రికార్డు చేశారు. కమీషనర్ గారు శెలవుపై ఉన్నందున సమావేశానికి హాజరుకాలేదు. సభ్యులలో 18 మంది హాజరైనారు.

ఆహారబంది నిమిత్తం ప్రస్తుతం ఒంగోలులో మకాంచేసియున్న జిల్లా కలెక్టరును, స్థానిక పురపాలక సంఘ సభ్యులలో కొందరు కలుసుకొని, పురపాలక సంఘ వ్యవహారాలను నివేదించారు.

### కమీషనర్ బదిలీ

స్థానిక పురపాలక సంఘ కమీషనరు కె. సత్యనారాయణ చౌదరిగారిని భీమునిపట్నం బదిలీచేయగా, వారు ఆరోగ్య కారణాలపై శెలవు కోరినట్లు తెలుస్తున్నది.

# క్రీడారంగం

## ఇండియా-వెస్ట్ ఇండీస్ 4-వ టెస్ట్ డ్రా

### వానవల్ల ఆఖరురోజుఆట మధ్యలో విరమణ

జార్జిటౌన్, మార్చి 17: ఇండియా వెస్టు ఇండీస్ క్రికెట్ 4-వ టెస్టు మేచు డ్రాగా ముగిసింది. ఇవ్వాళ వానవల్ల లంచి తర్వాత ఆట విరమింపబడింది. అప్పటికి ఇండియా జట్టు 2-వ ఇన్నింగ్సులో 5 వికెట్ల నష్టానికి 190 పరుగులు తీశారు. ఇవ్వాళ ఆట అరగంటసేపు మాత్రమే జరిగింది. ఆ కాసేపటిలో మన్కాడ్, ఉమ్రిగర్ కలిసి 28 పరుగులు సంపాదించారు.

స్కోరు వివరం: ఇండియా మొదటి ఇన్నింగ్సు- 263 (పి. రాయ్ 28, ఆప్టే 30, హజారే 30, మన్కాడ్ 66, ఫడ్కర్ 30, గాద్కరీ 50 (అవుటు కాలేదు), వెస్టు ఇండీస్ మొదటి ఇన్నింగ్సు 364 (వారెల్ 60, వీక్స 86, వాల్కాట్ 125), ఇండియా 2-వ ఇన్నింగ్సు 5 వికెట్లకు 190 (రాయ్ 45, ఆప్టే 30, రాంచంద్ 2, హజారే 9, ఉమ్రిగర్ 40, (అవుటు కాలేదు), మంత్రేకర్ 31, మన్కాడ్ 20, (అవుటు కాలేదు).

## దక్షిణాఫ్రికా-న్యూజీలాండ్ టెస్ట్ డ్రా

ఆక్లాండ్, మార్చి 17: దక్షిణాఫ్రికా, న్యూజీలాండ్ క్రికెట్ రెండవ టెస్టు ఇవ్వాళ డ్రాగా ముగిసింది. వెలుతురు తగ్గిపోయి ఆట త్వరగా ముగియవలసి వచ్చేసరికి న్యూజీలాండ్ జట్టు 8 వికెట్లు కలిగివుండి 301 పరుగులు వెనుకబడివున్నది. దక్షిణాఫ్రికా మొదటి ఇన్నింగ్సులో 377 పరుగులు తీసింది.

రెండవ ఇన్నింగ్సులో 5 వికెట్ల నష్టానికి 200 పరుగులుతీసి డిక్లేర్ చేసింది. న్యూజీలాండ్ మొదటి ఇన్నింగ్సులో 245 పరుగులుతీసి, రెండో ఇన్నింగ్సులో 2 వికెట్ల నష్టానికి 31 పరుగులు తీసింది. మొదటి టెస్టును ఇన్నింగ్సుతో గెలిచివున్న దక్షిణాఫ్రికాజట్టు ఇవ్వాళ అవిగూడా తేలాలన్న పట్టుదల చూపలేదు. నాయిలాపాయిలాగా ఆడి, ఎదిరికన్నా తమ పరుగులు 332 అధికంగావుండి, ఇక గంటన్నరమాత్రమే వ్యవధి వున్నదనగా డిక్లేర్ చేశారు.

## రంజీ ట్రాఫీ క్రికెట్

కలకత్తా, మార్చి 17: రంజీ ట్రాఫీ క్రికెట్ ఫైనల్లో పాల్గొనే బెంగాలు జట్టులో ఈ దిగువవారు వుంటారు. పి. సేన్ (కెప్టెన్), ఎన్. చటర్జీ, ఎస్. బెనర్జీ, బి. ఫ్రాంక్, ఎస్. కె. గిర్ధారీ, శివాజీబోస్, బి. దాస్‌గుప్త, పి. బి. దత్తు, ఎస్. బోస్, ఎన్. చౌదరి, డి. ఆర్. దాస్ 12వ వ్యక్తి, ఎస్. దాస్‌గుప్త. ప్రత్యామ్నాయులు, ఎ. మజుందార్, ఎం. సేన్, ఎన్. హెచ్. మిత్రర్.

ఎం. జి. విజయసారథి, ఎస్. వి. గంగోలీ అంపైర్లుగా వుంటారు.

## మోటారుసైకిల్ కొత్త స్పీడు రికార్డుకు యత్నం

మద్రాసు, మార్చి 17: శంకర్ రమణన్ అనే 28 ఏండ్ల యువకుడు మోటారు సైకిల్ మీద గంటకుపోయే వేగంలో కొత్త రికార్డు నెలకొల్ప తలుస్తున్నాడు. ఈ నెల 25వ ఇతడు బెంగుళూరు, మాండ్య రోడ్డు మీద తన మోటారు సైకిలుమీద ఈ ప్రయత్నం చేయనున్నాడు. గంటకు 120, 130 మైళ్ల వేగం చూపగలనని ఆయన ఉద్దేశం. ఈ ప్రయత్నానికి సౌత్ ఇండియా ఆటోమొబైల్ అసోసియేషన్ వారు పర్యవేక్షకులుగా వుంటారు.

